# గ్రంథాలయసర్వస్వము.

| సంపు. ౭ | బెజవాడ - డిసెంబరు ౧౯౨౮. | సంచిక ౬ |
|---|---|---|

## హుగ్లీ జిల్లా గ్రంథాలయ సభ

(అధ్యక్షులగు శ్రీ సీతాన్ గోస్వామిగారి యుపన్యాసము)

ఇతర దేశములందు ప్రాచీనకాలమందున్న గొప్పగ్రంథాలయములను గూర్చి మనము వినియుంటిమి. "బోడ్లియన్" గ్రంథాలయమువంటిదిగాని "బ్రిటిషు మ్యూజియము" వంటిదిగాని, మనకు లేకపోయెనని చాలమంది విచారించినారు. మన దేశమందట్టి గ్రంథాలయములుండుట అత్యంతావశ్యకము. కాని, ప్రభుత్వముయొక్క సహాయముండినగాని అట్టివి స్థాపింపబడజాలవు. ఇంగ్లాండు దేశమందు ముద్రింపబడిన గ్రంథములన్నింటియొక్క ఒక్కొక్క ప్రతిని "బ్రిటిషు మ్యూజియము" నకు పంపవలెనని ఆ దేశమందు చట్టముగలదు. అందుచేత దేశమందు ప్రచురింపబడు ఎట్టి చిన్న గ్రంథమైన ఆ గ్రంథాలయమందుండును. "బోడ్లియన్" గ్రంథాలయమందుగూడ అచ్చుపడిన గ్రంథములన్నియుగూడ గలవు. "జాతికి అర్హమైన గ్రంథాలయమే లభించును" అని "ఛాఫమన్" గారు నిన్నటి సాయంకాలము చెప్పినారు. వారుచెప్పిన మాటలనుబట్టియే కలకత్తా ఇంపీరియల్ గ్రంథాలయము వైస్రాయిలలో నొకరగు లార్డుకర్జన్‌గారిచే స్థాపింపబడినదనియు, పిమ్మటి గవర్నరులును వైస్రాయిలును దానియెడల ఏమాత్రము శ్రద్ధయును వహింపలేదనియు అందుచేత ఒక దేశ ప్రభువులు విద్యావ్యాసంగము కలిగినవారైనయెడల ఆ దేశమందలి గ్రంథాలయము లభివృద్ధి జెందుననియు లేనియెడల అభివృద్ధి జెందవనియు తేలుచున్నది. కాన నేనిట్లు చెప్ప సాహసించెదను. "జాతికి లభించిన గవర్నరులనుబట్టి గ్రంథాలయము లుండును." నాకు ఇం

ఒకసంగతి జ్ఞాపకమునకు వచ్చినది. జర్మనీ దేశమందున్న "హిండెన్బర్గ" పట్టణమునందు నేనున్నప్పుడు సామాన్యుడగు ఒక పిల్లవాడు పట్టణమంతయు జూపించెదనని నావద్దకు వచ్చినాడు. వానికి ఇంగ్లీషుభాష కొద్దిగావచ్చును. కాని ఫ్రెంచిభాష బాగుగా వచ్చుటచే ఆభాషయందే వానితో చాలసేపు మాట్లాడితిని. ఆపిల్లవాడు బాగుగా చదువుకొన్నాడు. ఆచదువంతయు ఆపట్టణమందున్న ఒక పౌర గ్రంథాలయమందలి గ్రంథములను జదువుటవలననే ఆపిల్లవానికి లభించినదని తెలిసికొంటిని. ఈ పౌరగ్రంథాలయములు అచటి ప్రభుత్వము వారిచే నిర్వహింపబడు ఉచిత ధర్మ గ్రంథాలయములు. నేను జర్మనీకి బోయిన రోజులు యుద్ధపు కాలము. అప్పుడు ఆదేశమందలి జనులకు రోజుకు రెండుసారులుకూడ భోజనములేదు. అట్టి స్థితియందుకూడ ఈగ్రంథాలయములకు మాత్రము ఎట్టికొరవును లేదు. యుద్ధసమయమగు 1914 సంవత్సరమున మన దేశ ఆదాయము 76 కోట్లనుండి 130 కోట్లకు పెరిగెను. కాని విద్యావిషయమునను ఆరోగ్యవిషయమునను, యేమాత్రమును అభివృద్ధిలేదు. అట్టిదేమైన ప్రభుత్వమువారివల్ల సహాయ మపేక్షింపకుండ మన స్వశక్తిచేతనే చేసికొనవలసి యుండెను. మనము పరస్పర సహాయముతో దేశాభివృద్ధికై పాటుపడవలసి యున్నది. మన పల్లెటూళ్ళమీదనే భారతజాతియొక్క అభివృద్ధి యంతయు ఆధారపడియున్నది, అందుచేత, పల్లెటూళ్ళయొక్క ఐశ్వర్య మభివృద్ధి చేయుటయే మన ప్రాప్యము. నేను లెజిస్లేటివు అసెంబ్లిలో సంవత్సరమున్నర కాలము సభ్యుడుగా నుంటిని. జనులయొక్క యథార్థమైన అభివృద్ధికి వలయు పనులకు ద్రవ్యమును ఖర్చుబెట్టించుటకు ప్రభుత్వమువారిని బలవంతపెట్టజాల మైతిమి. మీ తీర్మానములందొక దానియందు జిల్లాబోర్డులను లోకలుబోర్డులను ద్రవ్యసహాయము చేయవలసినదని అడుగుట యున్నది.

కాని ఈసంస్థలు వాని నిత్యకృత్యములకే సొమ్ముచాలని స్థితిలో నున్నవి. ప్రధానబాటలను మరమ్మతుగూడ చేసికొనజాలని స్థితిలో నున్నవి. మనము సహాయముకొరకు ఇతరులను అడుగకుందుముగాక. మనకున్నమార్గము లన్నింటిని వినియోగించి పనిచేయుదము. ఒక

గ్రామమందున్న గ్రంథాలయము యొక్క యుపయోగము ఆగ్రంథాలయము యొక్క భవనమును బట్టిగాని, దానియందున్న గ్రంథముల సంఖ్యనుబట్టిగాని, నిర్ణయించుటకు వీలులేదు. గ్రంథాలయము గ్రామ జీవనమునకు కేంద్రస్థానము. గ్రామమందలి జనులందరును కూడి మంచిచెడ్డలనుగూర్చి చర్చించుకొనుట కది కూడలిస్థలము. గ్రామమంతకును అది ఏర్పాటులను జేయు స్థలము.

స్వదేశ సంస్థానములందు గ్రంథాలయోద్యమము ఎక్కువగా వ్యాపించుచున్నది. బెల్గాంనగరమున జరిగిన అఖిలభారతి గ్రంథాలయ సభయందు జేరి ఆసభను చాలవరకు నడపితిని. ఆంధ్రదేశము నుండి వచ్చినవారే ఆసభకు జీవనమై నడపువారని నేను కనుగొంటిని. మైసూరు, బరోడారాష్ట్రములందు ఈయుద్యమము మిక్కిలి ఉచ్చదశయందున్నది.

ప్రతిగ్రామమందున్న గ్రంథాలయమును ఆగ్రామముయొక్క ఆర్థికచరిత్రను తయారుజేయ వలయుననునది మాతీర్మానములలో నొకటి. అది చాలమంచిపని. భారతవర్షమంతకును ఆర్థికవిచారణను చేయవలసినదని "అసెంబ్లీ" యందు తీర్మానమును ఉపపాదించినప్పుడు దానిని తోసివేయవలెనని ప్రభుత్వమువారు యోచించిరి. తుదకు ఆపనికై ఒక కమిటిని వేసిరి. ఈకమిటీకి అధ్యక్షులగు విశ్వేశ్వరయ్యగారితో నేను మాట్లాడియుంటిని. అధికారేతర సంఘముల యొక్క సహాయము యీవిషయమున అవసరమనియు, కుటుంబ ఆదాయవ్యయములనుగూర్చిన సంగతులు తెలిసికొనుట ఆవశ్యకమనియు మేము యోజించితిమి. ఈవిషయమున గ్రంథాలయములు తోడ్పడగలవు.

---

## గ్రంథాలయములు - నాడు - నేడు.

ఈ దేశముయొక్క విద్యావ్యాసంగచరిత్ర ఉన్నతాదర్శములతోను ప్రావీణ్యముతోడను నిండియున్నది; కొన్ని శతాబ్దములకు పూర్వదేశము స్వాతంత్ర్యము గోల్పోయినప్పుడు దానియొక్క క్రమవికాసమునకుగూడ భంగమువాటిల్లెను. భారతవర్షమున నాగరికతా

భానుడుదయించినప్పుడు పవిత్రవంతములగు నదీతీరములందు ఋషిపుంగవులు వేదఘోష జేయుచుండిరి. వ్రాతసాధనములు వెలయువరకు ఈఋషిపుంగవులు తమయొక్క జ్ఞానామృతమును శిష్యప్రశిష్యులచేత వ్యాపింపజేయుచుండిరి. పిమ్మట గ్రంథప్రతులను తాళపత్రముల మీదను, భూర్జరపత్రములమీదను వ్రాయుచుండిరి. ఇట్టిగ్రంథముల యొక్క సమీకరణమే మనదేశ గ్రంథాలయములకు ప్రాతిపదిక యయ్యెను. గ్రంథాలయమను నది ప్రత్యేకముగా పాశ్చాత్య సంస్థయని కొందరుచెప్పెదరు. సంస్కృత పరిజ్ఞానముచే పావనవంతంబైన భారతవర్షమునందు గ్రంథాలయములు బొత్తిగా నూతనములుగావు. తక్షశిల, నలంద, విక్రమశిల, ఉదంతపురి మున్నగు ప్రాచీన విశ్వ విద్యాలయములందు వేలకొలది వ్రాతప్రతులను జాగ్రతచేయు చుండిరి. హిందువుల దేవాలయములందును, బౌద్ధుల విహారము లందును, మఠములందును మతవిషయికమైనట్టియు, వేదాంతసంబంధమైనట్టియు, గ్రంథముల సముదాయములను మిక్కిలి జాగ్రతతో భద్రము జేయబడుచుండెను, "నలంద" విశ్వవిద్యాలయమందు "రత్నదధి"యను పేరుగల తొమ్మిది అంతస్థులుగలిగిన గొప్పమేడయందు విశ్వవిద్యాలయగ్రంథభాండార ముంచబడెను. ఆకాలమునం దా గ్రంథాలయము అమూల్యములగు గ్రంథరాజములచే నొప్పారి మిక్కిలి గొప్ప గ్రంథాలయముగ విరాజిల్లెను. ఏడవ శతాబ్దమున చీనా యాత్రికుడగు "హ్యూయనుత్స్యాంగు" భారతవిజ్ఞానమును గ్రోలుటకై మనదేశమున కేతెంచినప్పుడు నలంద విశ్వవిద్యాలయము ననేకసారులు దర్శించెను. ఈ గ్రంథాలయము ఎనిమిదవ శతాబ్దము నందు క్షీణించెను. విక్రమశిల, ఉదంతపురిల యందుగల గొప్ప గ్రంథాలయములు పాల్ రాజుల కాలమున ఉన్నతస్థితియం దుండెను. పదమూడవ శతాబ్ద ప్రారంభమున "భక్తియార్ ఖిల్జీ" యొక్క దండయాత్ర యందు యీ గ్రంథాలయములు నాశనము గావింపబడినవి. ఈ గ్రంథాలయములను సంరక్షించుచుండిన కొందరు బౌద్ధసన్యాసులు కొన్ని అమూల్యగ్రంథములను మాత్రము తీసుకొని నేపాలుదేశమున కేగిరి. ఈ విశ్వవిద్యాలయగ్రంథాలయములేగాక ఆకాలమున రాజులును

రాజబంధువులునుకూడ తమ మందిరములయందు గ్రంథాలయము లను గలిగి యుండిరి. ప్రాచీనపండితులు, చతుష్పతుల యొక్క అధ్యా పకులు స్వంత గ్రంథాలయములను గలిగియుండిరి. దేవాలయములందు వ్రాతప్రతులను సంరక్షించుట మతధర్మముగ నెన్నబడుచుండెను. వేదాంతగ్రంథములయొక్క ప్రతులను వ్రాయుటగూడ బౌద్ధ సన్యా సుల దినచర్యయందొకభాగముగ నేర్పడెను. మతగ్రంథములను ప్రత్యేకముగ సంరక్షించుట జైన భిక్షువుల విధిగ నేర్పడెను. అట్టి జైన గ్రంథాలయములిప్పటికిని పశ్చిమ హిందూదేశమందు "కేంబే" జసల్మీర్, "సూరతు" పట్టణములందు చూడగలరు.

క్రీస్తునకు పిమ్మట నాలుగైదు శతాబ్దములందు గుప్తవంశపు రాజుల పరిపాలనయందు మనదేశమున విద్యా ప్రాభవము మిక్కిలి ఉచ్ఛదశయందుండెను. "స్మిత్తు" వ్రాసిన ప్రచురము క్రీస్తునకు పిమ్మట 300 సంవత్సరములు మొదలు 650 సంవత్సరములవరకు గుప్త శకము. ఇంగ్లాండు దేశమున ఎలిజబిత్తు స్టూఆర్టు, శకములవలెనే ఈ శక ముగూడ హిందూదేశమున విద్యాభివృద్ధి విషయమున మిక్కిలి అభివృద్ధిని జూపినది. ఈయుగమునందే విఖ్యాతిగాంచిన విక్రమాది త్యుని యాస్థానమునందు నవమణులని ప్రఖ్యాతిగాంచిన యశోవం తులు విలసిల్లిరి. వీరు ఆవిషయము యీవిషయమని జెప్పనేల శారీర శాస్త్రము మొదలు వ్యాకరణ శాస్త్రము వరకు అన్నివిద్యలయం దును నిధులని విఖ్యాతిగాంచిరి.

గుప్త శకాంతరమున భారతవర్షము అనేక చిన్నరాజ్యముల క్రింద చీలిపోయినది. ఈ చిన్నరాజులలోగూడ కొందరు ప్రాచీన వ్రాతప్రతుల సంరక్షణయందు విశేష శ్రద్ధాభక్తులను గలిగియుండిరి. మహమ్మదీయుల పరిపాలనయందు హుమాయూను, అక్బరు, జహాం గీరు, ఫిరోజిషా చక్రవర్తులు యీవిషయమున మిక్కిలి ఔదార్యమును జూపిరి. వారికి లోబడియుండిన కొందరు హిందూరాజులుకూడ జ్ఞాన వ్యాపనమునకై అమితవ్యయమును జేసిరి. వారు వ్రాతప్రతులను సంపాదించుటయేగాక, విఖ్యాతిగాంచిన పండితులను తమ యాస్థాన ములయందుంచి పోషించుచు, జ్ఞానసముపార్జనాపరులకు గావల

సిన సహాయమునుగూడ జేయుచుండిరి. పదునొకటవ శతాబ్దము నందు భోజమహారాజు మిక్కిలి ప్రముఖ్యములగు గ్రంథరాజములను అమితముగ సేకరించెను. చాళుక్యులు మాళ్వదేశమును జయించి నప్పుడు ఈగ్రంథములను వారు తమగ్రంథాలయమునందు జాగ్రత్త పరచిరి. చాళుక్య రాజులలో నొకరగు విశాలదేవుడు ఈగ్రంథాలయ మునకై విశేషద్రవ్యమును వెచ్చించెను.

విశాలదేవుని గ్రంథాలయమునకు జెందిన శ్రీమద్రామాయణ వ్రాతప్రతియొకటి జర్మనీదేశమందున్న "బాన్" విశ్వవిద్యాలయ మునకు జేరినది. అనేక జర్మనీదేశ గ్రంథాలయములందు అపూర్వ ములగు సంస్కృతవ్రాతప్రతు లెన్నియోగలవు. నేపాళము, జమ్మూ, మైసూరు, బికనీరు, అళ్వారులందు వ్రాతప్రతులు అనంతములుగ సేకరింపబడియున్నవి. వీటియన్నింటిలోకి తంజావూరుమహాలు గ్రంథా లయము గొప్పది. దీనియందు 18,000 వ్రాతప్రతులుగలవు. నవీన కాలమందలి గ్రంథాలయములందు నేటిదినమున ఇక్కడ గ్రంథాలయ ప్రదర్శనము నుదెరచిన "చాఫ్మెన్"గారు గ్రంథభాండాగారిగాగల కలకత్తా ఇంపీరియల్ గ్రంథాలయమును మద్రాసునందలి కన్నెమ్మ రాగ్రంథాలయమును పూనాయందున్న భండార్కరు గ్రంథాలయము సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ గ్రంథాలయములును, బరోడా యందుగల కేంద్రగ్రంథాలయమును విశేష ప్రఖ్యాతిని జెందినవై యున్నవి.

హిందూదేశమున మానవ జీవితముయొక్క ఆధ్యాత్మిక ఔన్న త్యభాగము విశేషాభివృద్ధిని గాంచినప్పటికిని, ప్రాపంచిక వ్యవహార భాగముకూడ ఉపేక్ష చేయబడియుండలేదు. హిందూదేశము భోగభూమిగ గాక, కర్మభూమిగ విఖ్యాతిజెందినది. కర్మయొక్క ఉత్తమ భావము నిష్కామము. అనగా పనియొక్క ఫలితమును తా ను కోరక పరాత్పరునికి విడచిపెట్టుట: ఈదేశమున మానవ జీవితము యొక్క వివిధమార్గములు హెచ్చు తగ్గులు లేని శాస్త్ర కట్టుబా టులవలన నడుపబడుచున్నవి. జనసామాన్యము తృణీకారభావముతో జూడబడి యుండలేదు. వేదాధికారము ద్విజులకు మాత్రము ప్రత్యే

క్షింపబడినప్పటికిని, అక్షరాస్యులు కాని జనసామాన్యము యొక్క జ్ఞానాభివృద్ధికిగాను అనేక మార్గములు అవలంబింపబడి యున్నవి. హరికథలు, పురాణ శ్రవణములు, భాగవతములు, జంగము కథలు మున్నగునవి యన్నియు జనసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధికొరకే ఏర్పడినవి. అక్షరజ్ఞానము లేని పాటకపు జనులచే రచియింపబడి, తర తరముల నుండి, ముఖాముఖిని ప్రచారమగుచున్న గాథలను జూచిన, మన జాతియొక్క అద్భుతమగు ఆధ్యాత్మి కౌన్నత్యము గోచరించును. ఆగాథల యందలి దయారసము, శోకరసము, మెరుగుపూతలులేని కథ, ఇవి యన్నియు విద్యాగంధ మెరుంగని సామాన్య జనుల మనసు యొక్క వికాసమును జ్ఞానాభివృద్ధిని దెలియ జేయుచున్నవి. ఆదినముల యందు విద్యయొక్క ఆదర్శము అక్షరములను నేర్చుకొనుట, వ్యాకరణమును జదువుకొనుట మాత్రముగాదు. నిద్రాణమై యున్న ఆత్మను దీపింప జేసి, పౌరునికి గావలసిన సన్మార్గజీవనమునకు గొని పోవుటయే విద్యయొక్క ఆదర్శము.

కాని ఇప్పుడా కాలములు మారినవి. జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధి గలుగుటకు ఆదినములందు అవలంబింపబడిన పద్ధతులు నశింపుచున్నవి. ఔన్నత్యము ననుభవించిన ఆప్రాచీన కాలము చరిత్రస్థము మాత్రమైనది. ఈకాలమునకు దగినట్లు మనము వర్తింప వలెను. క్రొత్తదానికి స్థల మిచ్చి పాతమార్గము మారిపోయినది. నాగరికతాభివృద్ధికి మనము వెనుకబడగూడదు. అజ్ఞానాంధకారము నుండి మన సోదరులను సోదరీమణులను ఉద్ధరించినగాని మనమొక్క అడుగైన ముందునకు వేయజాలము. జనసామాన్యముయొక్క విద్యయే మనమీ నిమిషమున ఆలోచింపవలసిన విషయము. దీనికి ప్రాథమిక విద్యమాత్రము చాలదు. గ్రంథములు, పత్రికల మూలమున జ్ఞానాభివృద్ధి గావించుటకు తోడ్పడవలెను. విద్యావ్యాపనకు గ్రంథాలయములు మిక్కిలి ఉపయుక్తములగు సంస్థలు. ఈదినములందవి ఉండక తప్పని సరియయ్యెను. పాశ్చాత్యదేశములందు గ్రంథాలయములను పుస్తక సముదాయము లుంచు స్థలములుగా పరిగణించుట లేదు. గ్రంథాలయములే జాతీయజీవనమునకు రంగస్థలములుగ బరి

గణింపబడుచున్నవి. అక్కడనుండియే జ్ఞానసంబంధమైన నీతి సంబంధమైన ఆధ్యాత్మికమైన సాంఘికమైన శరీర సంబంధమైన రాజకీయమైన అవియివి యన నేల అన్నింటికి సంబంధించిన ఉద్యమములును ఉద్భవించు ననియును వారి యాశయము. ఈదేశమునందు ఆంగ్ల విద్యావ్యాపనముతో పట్టణములందును పల్లెల యందును గ్రంథాలయములు వ్యాపింపదొడంగినవి. సర్వసామాన్యముగా ఈ గ్రంథాలయములు సభ్యుల నుండి, చందాలు వసూలు పరచుట మూలముగా నిర్వహింప బడుచున్నవి. ఇది స్వయం సహాయమునకు మంచి దృష్టాంతరమేను. కాని ద్రవ్యాభావముచేత, గ్రంథాలయముల పనులు వికసించుట లేదు. కొంతకాలమునకు అందరి అభిమానము తగ్గుచున్నది. మరికొంత కాలమునకు ఆగ్రంథాలయ స్థాపనచేసిన ఒక రిద్దరియొక్క శక్తి పూర్తిగా నశింపగా, గ్రంథాలయము నశించుచున్నది. అందుచేత ప్రతి మానవుడును, తాను జీవించి యున్నంతకాలమును తన జ్ఞానాభివృద్ధిని జేసికొనుటకు గ్రంథాలయము తప్పని సరియని భావించి దాని యందు మోజు గలిగి యుండిననేగాని గ్రంథాలయము నిర్వహింపబడదు.

మనదేశమందు పిల్లలలో చాల కొద్దిమంది మాత్రము విద్యను పొందుచున్నారు. మన ప్రాథమిక పాఠశాలలో వారికి అబ్బు విద్య బహు స్వల్పము. ఆ స్వల్ప విద్యకు తోడు పిమ్మట చదువువలన వారి జ్ఞానాభివృద్ధి గానియెడల వారి చదువుమీద ఖర్చు పెట్టినది వృథాగా ఖర్చుపడినట్లేను. వారు జ్ఞానాభివృద్ధిని జేసికొనుటకు సార్వజనిక గ్రంథాలయములు మిక్కిలి సహాయభూతములుగ నుండును. ప్రపంచమునందున్న దేశములం దన్నిటి యందును అమెరికాదేశమే గ్రంథాలయోద్యమాభివృద్ధి యందు మార్గదర్శకమై యొప్పియున్నది. ఆ దేశమునందు ముఖ్యమగు గ్రామములం దెల్ల ధర్మగ్రంథాలయములు స్థాపింపబడి యున్నవి. ఇంతేగాక, జీవనోపాధికిగూడ తంటాలు పడుచుండెడు కటికి బీదవానికిగూడ గ్రంథములు అందుబాటులో నుండుటకుగాను మిక్కిలి చిన్నవగు పల్లెలకుగూడ సంచారగ్రంథాలయము పేటికల నంపెదరు.

వివిధవిషయములను గూర్చి వివరించు చక్కని గ్రంథములుగలిగిన నట్టి సంచారగ్రంథాలయ పేటికలు కొన్ని ప్రతిగ్రంథాలయము నందును ప్రత్యేకింపబడియుండును.

భాండాగారి గ్రంథాలయములు లేని గ్రామములకుబోయి తాను తెచ్చిన పుస్తకములపట్టికలను జనులకు పంచిపెట్టి వారికి పఠనాభిలాషను కలుగజేయును. అంతట గ్రామస్థులు ఒక్కరొక్కరే వచ్చి గ్రంథములను గొనిపోయి చదివెదరు. ఆగ్రామస్థులు చదువుట ముగించిన పిమ్మట సంచారగ్రంథ భాండాగారి ఇంకొక గ్రామమునకు బోవును. విద్యార్థులకును, ఉపాధ్యాయులకును ఉపయుక్తములైన గ్రంథములను అలమారులలో బెట్టి వాటిని పాఠశాలలందలి ఉపాధ్యాయుల వశమునందు విడచెదరు. ఆపుస్తకములు విద్యార్థులు చదువునటుల ఉపాధ్యాయులు అభిరుచిని గలిగించెదరు. ఆప్రకారము ఒకసారి తెచ్చిన పుస్తకములను ముగించినపిమ్మట గ్రంథభాండాగారి ఆ పుస్తకములను గొనిపోయి వేరొక అలమారును బంపును. జ్ఞానమును వ్యాపింప జేయుటకుగాను ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలకు ఈవిధముగా గ్రంథాలయములు తోడ్పడును. గ్రంథములు స్వయముగా చదువుకొనజాలని జనులు నివసించు ప్రదేశములకు గ్రంథ భాండాగారి వెళ్ళి వారికికావలసిన గ్రంథములను చదివి వినిపించును. విద్యార్థులు యాత్రలకు వెళ్లినప్పుడు ఆవిద్యార్థులకు కావలసిన విషయములనుగూర్చి బోధింపగలిగిన విజ్ఞానినొకనిని గ్రంథాలయమువారితో గూడ బంపును. ఫ్యాక్టరీల గుమ్మములయొద్ద ఫ్యాక్టరీకూలీలకు ఉపయుక్తములగు గ్రంథములపట్టికలను అతికించి ఆగ్రంథములు చదువుటకు అభిరుచిని గలిగించెదరు. ఈవిధముగా సంఘమునందుండు అన్ని రకముల జనులకును అమెరికాదేశ సార్వజనిక గ్రంథాలయములు వివిధమార్గముల ఉపయుక్తములగుచున్నవి.

భారతవర్షమున బరోడాదేశము మార్గదర్శకముగ నున్నది. హిందూదేశమునందున్న స్వదేశసంస్థానము లన్నింటిలోకి నిర్బంధఉచిత ప్రారంభవిద్యను అమలులో పెట్టుటయందేగాక అమెరికాదేశపద్ధతుల మీాద గ్రంథాలయోద్యమమును ప్రారంభించుటకుగూడ బరోడా

మహారాజు ప్రథమస్థానమును ఆక్రమించెను. బరోడాయందు గ్రంథాలయశాఖ రాజ్యాంగము నందొక శాఖగ ౧౬ సంవత్సరముల క్రిందట ప్రారంభింపబడెను. అమెరికా శాస్త్రవేత్తయగు బోర్డను దొరగారిని ఈపనికై నియోగించెను. కేంద్ర గ్రంథాలయమును స్థాపించెను. సంస్థానముయొక్క అన్నిభాగము లందును తన పోషకత్వము క్రింద గ్రంథాలయములను పఠనమందిరములను స్థాపింపజేసెను. హిందూదేశమందెల్ల ప్రథమగ్రంథాలయ పాఠశాలను స్థాపించెను. బోర్డనుదొర మూడుసంవత్సరములు పనిజేసెను. పిమ్మట కుడుహాల్కారుగారు ఆస్థానమును వహించి సత్వరాభివృద్ధినిజూపిరి. బరోడా కేంద్రగ్రంథాలయమందు ౮ శాఖలుగలవు.

(౧) గుమాస్తాలు, నౌకరులు (2) పుస్తకముల నెరువిచ్చు శాఖ (3) పుస్తకముల పట్టిక, ఇంటికి ఎరువియ్యని గ్రంథములు (౪) పఠన మందిరము (౫) పిల్లల స్త్రీల శాఖ (౬) మహిళా శాఖా గ్రంథాలయము (౭) సంస్కృత భాగము, సంస్కృత గ్రంథ ప్రకటన సహితముగ (౮) గ్రంథములకు అట్టలను కట్టు శాఖ.

గ్రామగ్రంథాలయ శాఖయందీ విభాగములు గలవు:—

(1) పట్టణ, గ్రామ గ్రంథాలయ భాగము (౨) సంచార గ్రంథాలయ శాఖ (3) ప్రదర్శన శాఖ.

కేంద్ర గ్రంథాలయమందు 98,904 గ్రంథములు గలవు, ఇవిగాక 18,543 గ్రంథములు సంచార పేటికలందు గలవు. 1910 సంవత్సరమునందు మహారాజాగారు తమ స్వంత గ్రంథాలయమందు గల 20,000 గ్రంథములను అందరి ఉపయోగమునకై ఇచ్చివేసెను. ఇప్పుడాయన తన సంస్థాన ప్రజలలో నౌకరుగానే ఆ గ్రంథముల ఉపయోగమును పొందుచున్నారు. కేంద్ర గ్రంథాలయము నందు గతవత్సరము 95,927 గ్రంథములు చదువబడెను. ఇవిగాక పట్టణమందు సంచార గ్రంథాలయ పేటికలనుండి 6,136 గ్రంథములు చదువబడెను. హిందూదేశమందు ఏ గ్రంథాలయ మందును ఇంత ఎక్కువ గ్రంథములు చదువబడి యుండలేదు. కేంద్రగ్రంథాలయము పట్టణ వాసస్థు లందరికిని ఉచితము. ఈ గ్రంథాలయమునుండి గ్రంథ

ములను ఎరువు దీసికొను వారి సంఖ్య 3,674. పుస్తకములుండు బీరువాలకు తలుపులు పెట్టకుండ, అందరిని బీరువాలనుండి పుస్తకములనేరుకొననిచ్చు పద్ధతి అమెరికా దేశములో సర్వసామాన్యముగా నున్నది. ఆ పద్ధతిని బోర్డన్ దొరగారు బరోడాయందును వ్యాపింప జేసిరి. గ్రంథముల పట్టికనుండి పుస్తకములను ఏర్చుకొనుట కంటె, బీరువాలనుండి పుస్తకములనుపరిశీలించి, స్వయముగా తీసికొనుట వలన గ్రంథాలయము చదువరికి అమితమైన ఉపయోగమును కలుగజేయును. ఈ పద్ధతి వలన గలుగు నష్టములు స్వల్ప వివరములందు మాత్రము గలవు. అవి కొంచెము జాగ్రత్తవలన సర్దుబాటు కాగలవు. 200 కంటె ఎక్కువ పత్రికలుగలిగిన పత్రికా పఠనమందిరము ప్రతిదినము 12 గంటల కాలము తెరచి యుంచబడును. కేంద్ర గ్రంథాలయము పక్షమున నడుపబడు వివిధములగు పనులలో పిల్లలశాఖ యొకటి. దీనియందు ఇంగ్లీషు తెలియని పిల్లలకు పనికివచ్చు 2000 గ్రంథములు గలవు. పిల్లలు ఆటలాడుకొనుటకు ప్రత్యేక మొకగది గలదు. ఈ శాఖయందు బాలురు తమ ఇంటియందుండునంత ఖులాసగానే యుండి, తమకు నచ్చిన ఆటల నాడుకొందురు. ఈ శాఖ స్త్రీ గ్రంథ భాండాగారి యాధీనమందున్నది. ఈ స్త్రీగ్రంథ భాండాగారియే మహిళా గ్రంథాలయమును గూడ జూచుచుండును. ఈ మహిళా గ్రంథాలయమునకు ప్రత్యేకముగ పుస్తకములును పత్రికలును గలవు. పట్టణమునందు గల మూడు స్త్రీ సంఘములకు బోయి ఈ స్త్రీ గ్రంథ భాండాగారి పుస్తకములను చదువు కొనుట కిచ్చుచుండును. క్రిందటిసంవత్సరము ఈ మహిళా గ్రంథాలయ శాఖయందు 18,209 గ్రంథములు జమవబడెను. ఇవిగాక 4,039 గ్రంథములను పిల్లలు జదివిరి సంస్కృత భాగమందు 5412 ముద్రిత గ్రంథములును, 13,09 అముద్రిత గ్రంథములును గలవు. సంస్థానమందంతటను మహారాజుగారి సహాయముతో గ్రంథాలయములు స్థాపింపబడినవి. అక్కడ గ్రంథాలయములు 3 విధములు. గ్రామగ్రంథాలయములు, పట్టణ గ్రంథాలయములు, (నాలుగు వేల జనాభా గలిగిన పట్టణము లందలివి) ప్రాంత గ్రంథాలయములు (జిల్లాపట్టణ మందలివి.) పల్లె గ్రంథాల

యము రు 50 లను, పట్టణ గ్రంథాలయము రు 300 లను, ప్రాంత
గ్రంథాలయము రు 700 లను సంపాదింప గలిగిన యెడల, మహా
రాజావారు అంతసొమ్మును ఇచ్చెదరు. జిల్లా బోర్డువారు ఇంకొక
యంతసొమ్ము నిచ్చెదరు.

ఈ సూత్రమే గ్రంథాలయ భవనముల విషయమున గూడ
నవలంబింప బడినది. ఒకవంతు సొమ్ము చందాల మూలమున వసూలై
నయెడల, మిగిలిన రెండు వంతులలో ఒక వంతు ప్రభుత్వము వారును
రెండవ వంతు జిల్లాబోర్డువారును ఇచ్చెదరు. గ్రంథాలయము
స్థాపింపలేని స్థలములందు పఠనమందిరములను పెట్టినను ఈ రీతినే
సహాయము చేయుదురు. సంచార గ్రంథాలయ పేటికలను
గ్రంథాలయములును, పఠనమందిరములును గూడ తెప్పించుకొని
ఉపయోగించుకొనవచ్చును. పట్టణ గ్రంథాలయములుగాక 598
గ్రామ గ్రంథాలయములును 91 పఠన మందిరములునుగలవు.
39 గ్రామగ్రంథాలయములకు స్వంతభవనములుగలవు. ప్రభుత్వ
మువారి పోషణక్రింద నున్న ఈ గ్రంథాలయములు గాక ప్రత్యే
కము చందాలవలన పోషింపబడు 15 గ్రంథాలయములు గలవు.
ఇందులో ఒకటి ప్రత్యేకము స్త్రీలకు చెందియున్నది. గ్రంథములు
సంచారగ్రంథాలయ పేటికలమూలమున గూడ వ్యాపకము చేయబడు
చున్నవి. 15 మొదలు 30 పుస్తకములవరకు ఒక పెట్టెయందుపెట్టి
ఉంచెదరు. అట్టిపెట్టెలకే సంచారగ్రంథాలయ పేటికలనిపేరు. ఈ
పేటికలను ఏగ్రంథాలయముగాని. పాఠశాలగాని, సంస్థగాని, లేక తన
గ్రామమందు చదువుకొనుటకు ఎరువిచ్చుటకై అంగీకరించిన ఏపెద్ద
మనిషిగాని ఎరువుతీసికొని రెండుమొదలు మూడు మాసములవరకు
ఉంచుకొనవచ్చును. గ్రంథములను ఉచితముగానే చదువుకొననిచ్చె
దరు. రైలుఖర్చులనుగూడ కేంద్రగ్రంథాలయమే భరించును. జన
సామాన్యమందు విద్యను వ్యాపింపజేయుటయొక్క ప్రాశస్త్యమును
ఆంగ్లేయ దేశమందొక శతాబ్దమునకు పూర్వమే గుర్తింపబడినది. గడ
చిన పాతిక సంవత్సరములలో ఈ యభిప్రాయము అమెరికా దేశ
మందు వ్యాప్తమైనది. ఆ దేశమందు వ్యాపించియున్నరీతిని సంచార

గ్రంథాలయములు ఇంకే దేశమందును వ్యాపించి యుండలేదు. జన సామాన్యమందు జ్ఞానమును వ్యాపింపజేయవలయునను ఈ సదభిప్రాయము హిందూ దేశమునందు వివిధ భాగములందు వ్యాపించుచున్నది. చదువుకొనజాలని జనుల ఉపయోగార్థమయి బరోడాయందు ప్రదర్శనశాఖ యేర్పరుపబడినది. ఈ శాఖయందు మాజిక్ లాంతర్లు, సినిమోటోగ్రాఫులు, స్టిరియోగ్రాఫులు, స్టిరియోస్కోపులు మున్నగు వానిచే బొమ్మలను చూపుచు వారికి ఉపన్యాసముల నిచ్చెదరు.

బరోడా మహారాజుగారిచే ప్రారంభింపబడిన ఈ మహత్కార్యము భారతవర్షమున ఇతర భాగములందుకూడ అవలంబింపబడుచున్నది. ఆ మహారాజు చెప్పిన ఈ క్రింది వాక్యములు గమనింప తగియున్నవి :—

"గ్రంథమును మన జీవితమునందొక భాగముగ జేసికోవలెను. గ్రంథాలయములు ఆవశ్యకములుగాని, విలాసములుగావు"

బొంబాయి సేవాసంఘమువారు సంచార గ్రంథాలయ పేటికలను ఏర్పాటు జేసి అమెరికా బరోడా పద్ధతులమీద గ్రంథములను జనుల కందజేయుచున్నారు. గ్రంథములను ఒకచోట పోగుజేసి వానిని భద్రపరచి కావలసినవారి కిచ్చుట యనునది తాతలనాటి పాత యభిప్రాయము. గ్రంథాలయము చదువరియొద్దకేబోయి, సంఘమునందున్న అన్ని తరగతులవారికిని జ్ఞానము కలుగజేయ వలయుననునది ఈ కాలముయొక్క అభిప్రాయము. కృష్ణా, గోదావరి డెల్టా భాగముల యందున్న ఆంధ్రదేశము గ్రంథాలయోద్యమమునకు విశేషమైన అభివృద్ధిని జూపినది. బరోడా మహారాజుగారి మార్గమును వారు అనుసరించిరి. వారు 500 గ్రంథాలయములను స్థాపించిరి. అందు 25 గ్రంథాలయములు పాఠశాలలను నిర్వహించుచున్నవి. పురాణపఠనము ఈ గ్రంథాలయములందున్న ప్రత్యేక విశేషమై యున్నది. పోటీపరీక్షలు పెట్టుటవలనను, వారికి బహుమతు లిచ్చుటవలనను, పాఠశాలలందలి పిల్లలకు అభిరుచిని గలుగజేయుచున్నారు. కొన్ని గ్రంథాలయములకు అంటి పరపతి సంఘములు నిర్వహింపబడుచున్నవి. కొన్ని గ్రంథాలయములు ధర్మములను చక్కగా నిర్వహించుచున్నవి. జాతీయ పండుగలను

మహావీరుల వర్థంతులను సలుపుటవలనను, హరికథలు, భజనలు, ఊరేగింపులు చేయుట వలనను, కథలు చెప్పించుటవలనను, వీధినాటకముల ఆడించుటవలనను, ఆ దేశమందలి గ్రంథాలయములు ఈ యుద్యమమును వ్యాపింప జేయుచున్నవి. వారు స్త్రీలకు పిల్లలకునుకూడ గ్రంథాలయముల నేర్పాటుజేసిరి. సంచార గ్రంథాలయములనుగూడ స్థాపించుటకు నిశ్చయించుకొనిరి.

మహారాష్ట్రధర్మ గ్రంథాలయ సంఘముయొక్క యాజమాన్యముక్రింద ఆదేశమందీ యుద్యమము బాగుగనే పనిజేయుచున్నది. గ్రంథాలయములును పఠనమందిరములు గలసి 150 స్థాపింపబడినవి. అందు గ్రంథాలయములయందు చదువుకొనజాలని జనులకు పత్రికలను పుస్తకములను చదివి వినిపించెదరు. పూనా పట్టణ పారిశుద్ధ సంఘమువారు ఈసంఘమునకు సంవత్సరమునకు రు 1000 ల విరాళ మిచ్చుచున్నారు. ఈసంఘముయొక్క ప్రోద్బలము చేతనే బొంబాయి పారిశుద్ధ సంఘమువారు ఆపట్టణమందు ఆరు గ్రంథాలయములను రు 12,000 లు వ్యయముచేసి స్థాపించియున్నారు. ఇప్పుడు అందు ఒక్కొక్క గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు 1,000 లు వ్యయముజేయుచున్నారు. ఇదిగాక బొంబాయిపట్టణమందు స్థాపింపబడు గ్రంథాలయములకు అవి ఖర్చుపెట్టు సొమ్మునందు సగముగాని మూడవవంతుగాని పారిశుద్ధసంఘమునుండి ఇచ్చుటకు ఏర్పాటుచేయబడినది. మహారాష్ట్రముయొక్క ఇతర భాగములందుగూడ గ్రంథాలయోద్యమము బాగుగ అభివృద్ధి జెందుచున్నది.

వంగదేశమందున్న పట్టణములందును, పల్లెలందును, అనేక గ్రంథాలయములును పఠనమందిరములును స్థాపింపబడుటకు మన యువకులే కారకులైయున్నారు. కాని వారు పెద్దవారైనప్పుడు వారి యుత్సాహము సాధారణముగా తగ్గిపోవుచున్నది. ముందుసంతతివారైన ఈపనిని కొనసాగించిన అవి అభివృద్ధిని బొందగలవు. లేనియెడల ఉత్సాహములేక అవి కృశింపగలవు. దేశమునందున్న గ్రంథాలయములన్నియు పరస్పరసహకారమును గలిగియుండుటయు, ఒక సంఘముగా నేర్పడుటయు అత్యంతావశ్యకము.

మనమందరమును సహకారోద్దేశముతో సదభిప్రాయముతో కలసి, ఈ గ్రంథాలయముల స్థితిని అభివృద్ధి పరచుటకును ఇవి ఇంకను ఎక్కువగా జనుల కుపయోగపడు మార్గములను గూర్చియు స్థిరస్థాయిగా నుండు మార్గములను గూర్చియు యోజించుటకును పూనుకొందుమేని, ఈ యుద్యమము జయప్రదమగుట కేమియు సందియములేదు. ముఖ్యమగు గ్రంథాలయము లన్నియు స్త్రీలకు, పిల్లలకు, చదువురాని వారికి ప్రత్యేక శాఖలను గలిగి యుండవలెను. సంఘసేవయు, గ్రామ పునర్నిర్మాణమును వానియొక్క పనులయందు చేర్చుకొనవలెను. గ్రంథాలయములు జ్ఞాన ధనముయొక్క పేటికలు. అందుచేత ప్రతివాడును ఈ గ్రంథాలయ ఉపయోగమును పొందునటుల జూడవలయును. పౌరుని కుండవలసిన యోగ్యతలను పొందుటకును, ప్రజాపాలన పద్ధతి నలవరచుకొనుటకును గ్రంథాలయము తరిబీతుస్థానముగా నుండవలయును. దానియందు పోట్లాటలు చేరగూడదు. జాతి, కులము, రంగు మున్నగు విభేదములు లేక, పరస్పర సహనమును, ఓర్పును అలవరచుకొనుటకు అందరికి ఇది రంగస్థలము. అది సరస్వతీదేవియొక్క పవిత్రవంతమగు ఆలయము. అక్కడనుండి యోగ్యతయు పవిత్రతయు ప్రసరించుచుండును.

## ఆంధ్రగ్రంథాలయము, కల్యాణి.

బొంబాయినగరమునం దొక భాగమగు ఈపురమున పై గ్రంథాలయమును శ్రీయుతులు మండ రామమూర్తిగారిచే స్థాపింపబడినది. పలువురు గ్రంథముల నొసంగి తోడ్పడిరి.

ఇందు పురాణములు, పద్యకావ్యములు, గద్యకావ్యములు, చరిత్రలు, ఇతిహాసములు, కథలు, నవలలు, నాటకములు, వ్యాకరణములు, ఛందశ్శాస్త్రములు, శబ్దశాస్త్రములు, అర్థశాస్త్రములు,

నిఘంటువులు, రాజకీయములు, ప్రహసనములు మున్నగు గ్రంథరాజములుగలవు.

ఈ గ్రంథాలయమునకు ప్రకృతము ఆంధ్రదినపత్రిక సమదర్శిని త్రైవారపత్రిక, భారతి, వాసవి, రెడ్డిరాణి, రాష్ట్రేతర ఆంధ్రులు, బొంబాయి తెలుగుసమాచార్, గ్రంథాలయసర్వస్వము మున్నగు మాసపత్రికలు చేరుచున్నవి.

ఈ పురమునందలి ఆంధ్రులు పెక్కండ్రు ఈ గ్రంథాలయమునకు చందాదారులుగా చేరి పొత్తములగైకొని చదివి సంతసించుచున్నారు. గ్రంథాలయము నిరంతరాయముగ దిన దినాభివృద్ధి నొందుచున్నది.

వాఙ్మయాభివృద్ధికి మొదటి మెట్టనదగు గ్రంథ పఠనార్థమై ఈ గ్రంథాలయము రాష్ట్రేతరములయందు స్థాపింపబడి ఆంధ్రము చదువ నిచ్ఛగలిగియు శక్తి విహీనులగు వారి కెందరికో తత్సౌకర్యములను ప్రసాదించు చున్నది.

వీణా సుబ్బణాచారి,
గౌరవ కార్యదర్శి.

---

# శ్రీ సహకార శారదా విద్యానిలయ పుస్తక భాండాగారము

### కుదుగొండ, నెల్లూరు జిల్లా,

ఈ గ్రంథాలయము 27-4-28 తేదీన స్థాపింపబడినది. 30 మంది సభ్యులు, 200 గ్రంథములు గలవు. 5 పత్రికలు తెప్పింపబడుచున్నవి. రు 100 లు మూల ధనము గలదు. రిజష్టరు చేయుటకు ప్రయత్నించుచున్నాము.